# సాంఘీకగేయములు

## రచన: బిజిబిళ్ళ లక్ష్మి వల్లీ దేవి

**Plot No. 208/A, Lakshmivihar, Nallagandla, Serilimgampally,**

**Hyderabad – 500 019, Phone No. (M) 8886776567**

**Email id : bijibilla.devi@gmail.com**



## విషయసూచిక


1) అందరం మనమందరం

2) అడవితల్లి

3) అనగనగా

4) ఆనందం ఆనందం

5) ఆలయమున దీపముతీరుగ

6) ఎంతఘనము ప్రకృతిసోయగం

7) కదిలిందీ యువతరం

8) కాన్నడ దేశాన

9) కన్నతల్లి

10) కలిసుందాం కలిసినడుద్దాం

11) కిట్టు బిట్టు చింటూ

12) క్రొత్త అల్లుళ్ళతో

13) గంగ సింధు బ్రహ్మపుత్ర

14) జాతిపిత మన బాపూజీ

15) తనవారలని తలచినవారే

16) దీపావళి

17) దేహములే వేరులే

18) నమో నమో జయ భరతమాత

19) నలుదిక్కులలో

20) నవ్వూ నవ్వూ చిరునవ్వూ

21) పద పద పద

22) పైపై మెరుగులను

23) బాలలం మేం బాలలం

24) బిడ్డనుచూచీ

25) భరతమాత

26) లాలిపాట

27) విధిబలీయమని

28) విరిసి విరియని పూవులం

29) శరణం భవ శరణం

30) శ్రీరస్తు

31) సప్తవర్ణములు

# అందరం మన మందరం

"పల్లవి" : అందరం మన మందరం "2"
పాడాలీ సమతాగీతం
అందరం, మనమందరం
ఇవ్వాలీ... నవసందేశం "అందరం"

"చ" : పల్లె, పల్లెల, వాడ వాడల
కదలిరండి! ఓ! యువకులారా! "2"
బీదల, సాధక బాధలన్నియును
తుడిచివేయగ కదలిరండి "అందరం"

"చ" : వారి జీవన గమనములో
చిరువెలుగులను, నింపగ రండి "2"
ఆకలి కడుపులు నింపండి "2"
కనుల ఆనందం చూడగ, రండి "అందరం"

"చ" : భావిపౌరుల అభ్యున్నతికై
పోషకాహారం, మరివిద్య కొరకై "2"
సత్వరమే కదలిరండి "2"
దేశోన్నతిలో భాగస్వాములై "అందరం"

# అడవితల్లి

"పల్లవి" : అడవితల్లిని, కాయుమన్నా
పుడమితల్లి, పులకుంచుననా్న "2"
ప్రకృతిమాత కన్నెర్ర జేసిన
నరుని బ్రతుకిక, శూన్యమన్న "2" "అడవి"

"చ" : మనుగడంతను ప్రకృతిమీదను
ఆధారపడెను, ఎవరుకాదన్న "2"
వన్యప్రాణుల, నివాసములు
వనదేవతల, ఉద్యానవనములు "2" అడవి"

"చ" : రైతన్న గుండెల ఝురులసవ్వడి
పురివిప్పె, చేను చిరుచినుకుతో "2"
చెట్టు, చేమలు చేసె సడులు
కొండ, లోయల, సరాగములు "2" "అడవి"

"చ" : మనిషి వేసెను, సరి అడుగు
నేలతల్లికి, పులకింత కలుగు "2"
అడవితల్లిని, కాచుకొనిన
మన బ్రతుకులిక, పాలకోన "2" "అడవి"

"చ" : చక్కగ నవ్వెను, అడవితల్లి
మోము మెరిసెను, నేలతల్లికి "2"
కాపాడినపుడే మనకు మనుగడ
అపుడె జాతికి, పూలతలగడ "2" "అడవి"

"చ" : పులకించెను, పుడమితల్లి
కురిపించేను, సిరులపంటలు "2"
దేశమందున కరువుకాటకం
చిత్తగించెను, పలాయనం "2" "అడవి"

"చ" : ఆకసమునకు లేదు హద్దు
అడవులను పెంచడమే ముద్దు
కలిసి బ్రతుకుట మరువవద్దు
చెలిమి మనకిక జయము, కద్దు "2" "అడవి"

# అనగనగా

మాతృదేవోభవా; పితృదేవోభవ;

ఆచార్యదేవోభవ "2"

"పల్లవి" : అనగనగా ఒక ఊరు

ఉన్నది, అందునొక సెలయేరు "2"

సెలయేరు ప్రక్కన పాఠశాల

నెలకొనె, అహ్లాద వాతావరణం "అనగనగా"

"చ" : ఆ పాఠశాలలొ చదువుతుండెను

గోపీ యను నొక బాలుడు "2"

పాపం! కడు బీదడాతడు

తల్లి, పాఠశాలలొ, పనిచేయుచుండెను "2" "అనగనగా"

"చ" : పాపం! తల్లి అంధురాలు

కాయకష్టం చేయుచుండెను "2"

చదివించుకొనుచూ గోపీని

గడుపుచుండెను కాలమును "2" "అనగనగా"

"చ" : గోపి, ఒకనాడు తల్లితో ననెను

స్నేహితుల ఎదుటకు రావద్దని "2"

చూసేరు తనను చిన్నచూపని,

ఎగతాళి తనను, చేసేరని "అనగనగా"

"చ" : గిర్రున కాలం తిరిగినది

పెరిగి పెద్దవాడయ్యెను గోపి "2"

ఇంటివాడయ్యెను గోపి

తండ్రిగూడనయ్యె నాతడు "2" "అనగనగా"

"చ" : కాలక్రమేణ సంపన్నుడాయెను

డాబు, దర్పము పెరిగెను "2"

ఊరిలోనున్న, గోపి తల్లికి

మనుమని చూడాలనిపించినది "2" "అనగనగా"

"చ" : వెంటనె ముదుసలి బయలుదేరెను

తన మనుమని చూచుటకు "2"

ఇంటితలుపు తట్టినది

పాపం! ఆ ముదుసలి "2" "అనగనగా"

"చ" : చిన్ని అడుగులతో మనుమడు వచ్చె,
ఆమెను చూచి, భీతిల్లి పరుగిడె "2"
తిరస్కరించెను తండ్రి కోపముతో
భయపడెననీ... తనపుత్రుడు "2" "అనగనగా"

"చ" : నిరుత్సాహముతో, ఆ తల్లి
వెనుతిరిగెను తనపల్లెకు "2"
కొంతకాలమునకు ఆ తల్లి
పాపం! పరమపదించినది! "2" "అనగనగా"

"చ" : కొంతకాలమునకు గోపీకి
గుర్తువచ్చెను, తన తల్లి "2"
చూచుటకు పయనమాయెను
కానీ, ఇల్లు వేసియున్నది తాళం "2" "అనగనగా"

"చ" : ఉత్తరమిచ్చిరి పొరుగువారు
తల్లి ఈయమనినదని "2"
ఆత్రముతో తీసుకొని దానిని
చదివె నాతడు చీటీని "2" "అనగనగా"

"చ" : కన్నీటిధారలు ఆగలేదు

నోటిన మాటలు రాలేదు "2"

చిన్నతనమున తనకు జబ్బు చేసెనని

తల్లి, ఇచ్చినది నేత్రములని "2" "అనగనగా"

"చ" : పశ్చాత్తాపముతో కనులు నీరాయె

కానీ, అమ్మ ఇక రాదాయె "2"

సిగ్గుతొ, తలవంచుకొనెను

చేసిన తప్పిదము తెలిసికొనెను "2" "అనగనగా"

# ఆనందం ఆనందం

"పల్లవి" : ఆనందం ఆనందం
బాల్యమే ఒక కమ్మని వరము

"అ.ప." : ఆనందం ఆనందం
అదియే, మన, బాలల వశము "2" "ఆనందం"

"చ" : పొలాలగట్టుల పరుగులు తీయుట
వాగుల, వంకల స్నానమాడుట "2"
వెన్నెలకాంతుల నాస్వాదించుచు
గడపడమే ఒక మధురానుభవము "2" "ఆనందం"

"చ" : పూవులలోని తేనెను గ్రోలగ
పరవశమునా మేను ఫ్రొంగుట "2"
తోటల, కాయల, పండ్లను త్రెంపి
ఆరగించుటే మధురానుభవము "2" "ఆనందం"

"చ" : అమ్మ కోపమును కసరుకొని
పసితనమున ఆటపాటలు "2"
అమ్మ కఠినమే దీవనలవునని
తెలియరాని అమాయకత్వం "2" "ఆనందం"

"చ" : తాత, నానమ్మ చెంతన ఆటలు

బుద్ధినేర్పును వారి పులుకులు "2"

అమ్మమ్మ చెప్పే కమ్మని కధలు

వింటూనే కనులు మూతలు "2" "ఆనందం"

"చ" : ఆ కనులమూతల కంటిమి కలలు

చేసుకొంటిమవి, సఫలము, సత్యము "2"

అందమైన ఈ జీవితమందున

బాల్యదశయే, ఒక మధురానుభవము "2" "ఆనందం"

# ఆలయమున దీపము తీరుగ

"పల్లవి" : ఆలయమున దీపము తీరుగ
గృహలక్ష్మియె, ఇంటివెలుగుగ "2"
అలరారునులె! ప్రతిగృహిణి
గృహమున అందరి ఆనంద వర్షిణి "ఆలయమున"

"చ" : పుట్టింటిన నువు రాకుమారిగ
తోబుట్టువులకు ప్రియ సోదరిగ "2"
తల్లిదండ్రులకు, గారాల పట్టిగ
పెరిగేవూ నీవు కలల పంటగ "2" "ఆలయమున"

"చ" : "కల్యాణం, కమనీయం"
నీ పరిణయమే కలలగోపురం "2"
వరుని ప్రేలుతో చిటికెన ప్రేలుని
కలిపి నడచెదవు, ఏడడుగులు "2"
మెట్టినిల్లు నీ, సౌభాగ్యసీమగ "2" "ఆలయమున"

"చ" : మగని కనులలో కలల దేవతవి
పిల్లా పాపల రత్నగర్భవి "2"
అత్తా మామల ఆదరణతో
మెలిగేవు నీవు కులదేవతగ "2' "ఆలయమున"

"చ"   :  బిడ్డలకు నేర్పేవు బాల్యమందున

భవితకు వలసిన వినయ విద్యలు   "2"

సాగును వృద్ధితొ వారి నడత

దేశానికి వలయు మంచి యువత "2"  "ఆలయమున"

"చ"   :  గృహిణిగ నీవు నెరవేర్చెదవు

గృహమున అందరి బరువు, బాధ్యతలు   "2"

"గృహలక్ష్మి" అంటే నీవేలే!

# ఎంతఘనము ప్రకృతిసోయగం

"పల్లవి" : ఎంతఘనము ప్రకృతిసోయగం "2"

మధురానుభవము, మనోల్లాసము "2" "ఎంత"

"చ" : భగవంతుని సృష్టి, ఈ అఖిలజగతి

ఆనందానుభూతి, సుందర రసనిధి "2"

దివినుండిజారిన అమృతబిందువిది

మానవాళికిదె జీవన ప్రతినిధి "2" "ఎంత"

"చ" : సృష్టి ఉద్భవం, ప్రకృతితొ ఆరంభం

మనిషి మనుగడ నాటితొ, ప్రారంభం "2"

అత్యంతశోభితం, సతతహరితం

అతిసుందరములు హిమాలయములు "2" "ఎంత"

"చ" : ఉదయభానుని కిరణస్పర్శతో

పురివిప్పి నెమలి, ఆనందనాట్యం "2"

తెలవారెనులె ప్రకృతిమాతకు

ఆ దేవదేవుని ఉద్భవమునకు "2" "ఎంత"

"చ" : పక్షులు చేసే కిలకిల రావములు

కోయిల స్వరములె వీణానాదములు "2"

విరులు, ఝరులు, తరుల హాసములు "2"

గిరుల గాంభీర్యం, ఉన్నతికి సూచనం "2" "ఎంత"

"చ" : జలధులు, నదులు, ఉపనదుల శోభతో

ప్రకృతి మురిసే, పుడమి పులకించె "2"

కీకారణ్యములు, జంతువాసములు

సంరక్షణయే శ్రేయోభిదాయకం "2" "ఎంత"

"చ" : ఔషధుల నిలయములు, అరణ్యములు

అటవీసంపదకు మూలనిధులు "2"

ప్రకృతి వనరుల సంరక్షణయే

పరమావధిగా ఎరిగిననాడు "2"

నెలమూడు వానలు కురియునులే

ధరణి కన్నుల, కాంతిపుంజములే "2" "ఎంత"

# కదిలిందీ యువతరం

"పల్లవి" : కదిలిందీ యువతరం
కదిలిందీ నవతరం "2"
అపసవ్యపు సమాజాన్ని
కలసికట్టుగా నడిపించుటకై "2"
ప్రజానీకపు విలువలను
సమతుల్యం చేయుటకై "2" కదిలిందీ"

"చ" : అమానుషత్వం, అరాచకత్వం
దేశప్రగతికవి అవరోధాలు "2"
కూకటిప్రేళ్ళతో పెలికివేయుటకు
సత్వరమే నడుంకట్టి "2" కదిలిందీ"

"చ" : రాజకీయపు స్వార్ధకేళిలో
ప్రజాస్వామ్యమె మారుతువుంటె "2"
నాయకుల పెనుబలాలలో
సాటిమానవుని జీవనమే "2"
అడుగంటే, బరువాయె "2" "కదిలిందీ"

"చ" : సంఘవ్యతిరేక చర్యలతో
యువత బాధ్యతను మరుస్తువుంటె "2"
కర్తవ్యం గుర్తుచేస్తూ "2"
దేశ ఉన్నతికి పాటుపడమని "2" "కదిలిందీ"

"చ" : అతినాగరిక సమాజంలో
యువత పెడదారి పడుతూవుంటె "2"
దేశసంపద అపాత్రదానం "2"
అక్రమాలకు చెంపపెట్టులా "2" "కదిలిందీ"

"చ" : గోఖలే, బాలగంగాధరుడు
మోహనరాయ్, గురజాడ "2"
తమ జీవనగతినే మార్చుకొని
సంస్కరించిన మహానుభావులు "2"
త్యాగధనులు, అభిమానధనులు "2" కదిలిందీ"

"చ" : మంచియువకులు, మంచినడతలు
సాంఘికవిలువలు, దేశసంపదలు "2"
ఇదియే సత్యం, ఇదియే నిత్యం
యువతకిదే నవ సందేశం "2" "కదిలిందీ"

"అర్థం"  : మనదేశ సామాజిక, నైతిక విలువలను కాపాడుకోవాలని, ప్రతి సగటు మనిషికి న్యాయం చేకూర్చాలని, యువతరం మంచి మార్గంలో నడవాలని, అంతేకాక మన దేశ, రాష్ట్ర సహజవనరులు. ప్రకృతిసంపదలు, "అపాత్రదానం" కాకుండ మనం సద్వినియోగపరచుకోవాలని నా ఉద్దేశ్యం.  నా మనసులో కలిగిన భావనలే  ఈ చిన్ని గేయం.

# కన్నడదేశాన

"పల్లవి" : కన్నడదేశాన, పురంధరగడలో
జన్మించెనూ, పురంధరుడు "2"

"అ.ప" : కన్నడ భాషకు వన్నె తెచ్చిన
తొలుత వాగ్గేయ కారుడీతడు "కన్నడ"

"చ" : లలిత కళాకోవిదుడు
సకల విద్యా పారంగతుడు "2"
తండ్రికి చేదోడు, వాదోడాయెను
రత్నముల వ్యాపార వర్తకమందున "కన్నడ"

"చ" : గడియించెను, బహు ధన, సంపదలు
అయినను ఎరుగడు దానమెన్నడును "2"
దీనుల ఇక్కట్లు, ఎరుగనేరడు
తలచును, సంపద స్వర్గమని "కన్నడ"

"చ" : ఒకనాడు ఏతెంచె, నొక బ్రాహ్మణుడు
తనయుని ఉపనయనం, కోరెను ధనమును "2"
మరుదినమున, కలువమనియెను,
నిష్ప్రయోజనము, కోరిన ఫలము "కన్నడ"

"చ" : విసుగునొందెనా... వృద్ధబాపడు
కోరెసాయము, పురంధరపత్నిని "2"
జాలిగొనిన, ఆ సతీమతల్లి
ముక్కెరనిచ్చెను బాపనికీ "కన్నడ"

"చ" : అమ్మజూప, ఆ బడుగు బ్రాహ్మణుడు
చేకొని, పురంధరు కడకేగె "2"
వెంటనె, ఆతడు గుర్తించి, ముక్కెర
తెమ్మని, పంపెను, సేవకుని "కన్నడ"

"చ" : భీతిల్లెను, ఆ ధర్మపత్ని
గ్రోలగ, విషమును యెత్నించె "2"
ఏమి భాగ్యము! కనెను, ముక్కెరను
చేకొని యేగెను, సేవకుడు "కన్నడ"

"చ" : అచ్చెరువొందెను, పురంధరుడు
వచ్చిన, బ్రాహ్మణుడెవరోకాదని "2"
గ్రహించెను, కన్నుల నిండె, బాష్పములు
మారెను, ఆతడు రంగని దాసునిగా
అతని కరమునకు వెముకే లేదిక "కన్నడ"

"చ" : ఉపమాన, ఉదాహరణ, రచనలు

ఎన్నియొ, రాగములు, స్వరముల కృతులు "2"

కర్ణాటక సంగీత పితామహుడు

కరనాడున, పదవెలుగుగ వెలిగె "కన్నడ"

"చ" : జరుగును, జగతిన దైవఘటనలు

మనజుల, మార్పుకు, పరివర్తనకు "2"

చిద్విలాసము, చిన్మయరూపము

కని, పొందెదము, సోపానం "కన్నడ"

# కన్నతల్లి

"పల్లవి" : కన్నతల్లి మనకు ఇచ్చును, జననము

కానీ కోరదు, ప్రతిఫలము "2"

"చ" : ఫలాపేక్ష ఆశించని జీవులు

ఉన్నవి, యెన్నియొ, సృష్టియందున "2"

ఏమి ఒసగెదము! ఆ దేవదేవునకు

కోరిన ఆతడు, ప్రతిఫలమును "కన్న"

"చ" : సహాయపడునే! ... సమస్తజీవులు

నిరాపేక్షగ, ఇలను మానవులకు "2"

నిండె నరుని మది, స్వార్ధచింతనతొ

వీడిన నది, అతి చేరువ పరము "2" "కన్న"

# కలిసుందాం కలిసినడుద్దాం

"పల్లవి" : కలిసుందాం కలిసినడుద్దాం "2"
జాతిసౌఖ్యమే, మనసౌఖ్యముగ
జాతిపురోగతి మన అభివృద్ధిగ "2' "కలిసుందాం"

"చ" : ఆరుపదుల స్వతంత్రదేశం
కృషి నిర్విరామం, మార్గదర్శకం "2"
అహింసయే పరమధర్మమని
నడచినదీ కలసికట్టుగ "2" కలిసుందాం"

"చ" : ప్రజాస్వామ్యమున ప్రజలమాటకు
విలువ, ఇచ్చిన, మన పరిపాలన "2"
పంచవర్షముల, ప్రణాళికలతో
సాగినదీ మన పరిపాలన "2" "కలిసుందాం"

"చ" : అడుగడుగున అభివృద్ధికాంక్ష
వరమైనది సాంకేతికరంగం "2"
తీరెను, ఇక నిరుద్యోగక్షామం
యువతరాలకిది, సదవకాశం "2" "కలిసుందాం"

"చ" : వారసత్వపు రాజకీయములు
అడుగంటాలీ, తరిమికొట్టాలి "2"
ప్రతిపౌరునికీ ఆవకాశం
ఇచ్చిననాడే స్వర్ణయుగము "2" "కలిసుందాం"

# కిట్టు బిట్టు చింటూ

"పల్లవి" : కిట్టు, బిట్టు, చింటూ...,
ముువ్వురు మంచి స్నేహితులు "2"

"అ.ప" : చేయునులే! చిలిపి అల్లరి
వారి మనసులే... మల్లెలజాబిలి "కిట్టు"

"చ" : ఒకే రీతిగా మెలగెదరు
ఒకే తరగతిలొ చదివెదరు "2"
కలసి వెడలును పాఠశాలకు
ఒకే జట్టుగా, ఆ, ముగ్గురు "కిట్టూ"

"చ" : కలిసి తిరిగెదరు ఆటపాటలలొ
పాఠ్యాంశములను కలసి చదివెదరు "2"
కానీ, వారి యోచనలు వేరులే!
వేరులె వారి ఆశయమ్ములు "కిట్టు"

"చ" : చేసేరు సాయం, అమ్మ నాన్నకు
చేదోడు వాదోడు ఇంటిపనులలో "2"
పొందెదరు, మన్ననలు పాఠశాలలొ
చదువు సాగేను ప్రథమశ్రేణిలో "కిట్టు"

"చ"　:　భవిష్యత్తులో, చిన్నారిమనసులతో
తమ రంగములను ఎంచుకొనిరి "2"
కిట్టు ఆశయం, వైద్యవృత్తి
మరి బిట్టూదీ... న్యాయవాదిగ "కిట్టు"

"చ"　:　మన చిన్నారి చింటూ ఆశయం
అలుపెరుగని శాస్త్రవేత్తగ "2"
ఒకరితొనొకరూ... వాదనలు
ఎవరిది వారే, పైచేయిగ "కిట్టు"

"చ"　:　దృఢమైన ఆశయం కిట్టూది
ఉత్తమమైనది, వైద్యరంగమని "2"
వైద్యవృత్తియె పరమావధిగ
ఆరోగ్యమే మహాభాగ్యముగ "కిట్టు"

"చ"　:　మరి బిట్టూ ఆశయ రహదారిలొ
సంఘం నడచును, న్యాయబాటలొ "2"
న్యాయమూర్తియె, న్యాయదేవతని
న్యాయానికే... పెద్దపీటని "కిట్టు"

"చ" : చింటూకు కలదూ గట్టినమ్మకం
శాస్త్రవేత్త, జాతి అభివృద్ధిమార్గమని "2"
అతడే... మానవ జీవాధారం
శాస్త్రరంగమున చేరును తీరం "కిట్టు"

"చ" : వాదులాడుకొనిరి, చిరుకోపమున
ఏదియును తేల్చుకొనలేక "2"
వారివాదనలు గట్టు చేరవే
ఎవరికివారే, యమునాతీరే "కిట్టు"

"చ" : (వారు ముగ్గురు, మాష్టారు వద్దకు వెళ్ళి
వాదనకు కారణం తెలిపిరి).
మాష్టారు... మాష్టారు మామంచి మాష్టారు "2"
ఇవ్వండి మాకు మంచి సలహా
భవితలో ఇవ్వాలి మాకు ఆసరా "2" "కిట్టు"

"చ" : (మాష్టారు ఆ ముగ్గిరి భుజం తట్టి, మెచ్చుకొనుచు)
ఎంచుకొనిన మీ రంగములు
సంద్రమున దొరిగిన ఆణిముత్యములు "2"
కావాలి మీరు అగ్రశ్రేణులు
మీ వృత్తిలో, మీ బాటలో "కిట్టు" "2"

"చ" : (మాష్టారు కిట్టు వైపు తిరిగి)
"వైద్యో నారాయణోహరి" "2"
వైద్యుడుగ నీవు పేరు గాంచాలి "2"
బీదల పాలిటి దైవముగ
ఆరోగ్యం పంచే ఆదిదేవునిగ "కిట్టు" "2"

"చ" : (మాష్టారు బిట్టూ వైపు తిరిగి)
బిట్టూ, నీవు న్యాయవాదిగ
కాపాడు, ప్రజలను, ధర్మ దేవతగ "2"
నిర్దోషికి.... శిక్ష వలదు
న్యాయమును నీవు వీడవలదు "కిట్టు" "2"

"చ" : (మాష్టారు చింటూ వైపు తిరిగి)
నాయనా! చింటు! మరి, నీవు
రాణించూ... శాస్త్రవేత్తగ "2"
మనిషి మనుగడకు అతిముఖ్యం
వానితో సాగును శాస్త్రీయరంగం "కిట్టు"

"చ"  :  (మాష్టారు ఆ ముగ్గురివైపు తిరిగి)
ఎంచుకొనిన మీ మూడురంగములు
ప్రపంచమునకు ఆవశ్యకము  "2"
వైద్యం, న్యాయం, శోధనారంగం
వీనితో నడచును స్వర్ణభారతం  "కిట్టు"  "2"

"చ"  :  చేపట్టిన రంగం ఏదైనను
నీవంతు, కృషిగ, సాధించు పట్టును  "2"
అందించు, జాతికి, ఎనలేని కృషిని
మరువవద్దు, నీ నిజాయితి, నీతిని  "కిట్టు" "2"

"చ"  :  ఎవరికి వారు, వారి వృత్తిని
ఆదరించి గౌరవించిననాడు  "2"
అగ్రదేశముల దీటుగ నిలుచును
భారత దేశం, ఆనంద నయనాల "కిట్టు"  "2"

# క్రొత్త అల్లుళ్ళతో

"పల్లవి" : క్రొత్త అల్లుళ్ళతో
క్రొంగొత్త ముంగిళ్ళతో "2"

"అ.ప" : కళకళలాడినదీ..... మన
పల్లెలోని ప్రతిలోగిలి "క్రొత్త"

"చ" : సాలున మూడుపంటలతో
మెట్టమాగాణులతో "2"
మనగాదెలు నిండాలి
కళకళలాడాలీ "2" "క్రొత్త"

"చ" : నవధాన్యపు పొంగళ్ళు
భోగిమంటల లోగిళ్ళు "2"
రంగవల్లులతో
మరిపించెను, ఇంద్రధనుసు "క్రొత్త"

"చ" : దేశానికి వెన్నెముకని
రైతన్నని పొగడినా "2"
బాధలు తీరలేదు
రుణముక్తుడు కాలేదు "క్రొత్త"

"చ" : రైతన్నకు సాయము
చేయాలీ.... ప్రభుత్వం "2"
మెట్టు ఎక్కి దిగే స్థితి
ఇక రైతన్నకు రావద్దు "క్రొత్త"

"చ" : బాలలకు నేర్పాలి
మనదేశ సంస్కృతిని "2"
వారి లేత మనసులలో
అభిమానం పెరగాలి " అనగనగా"

# గంగ సింధు బ్రహ్మపుత్ర

"పల్లవి" : గంగ, సింధు, బ్రహ్మపుత్ర
జీవనదులకు పుట్టినిల్లుగ
అలరారినదీ భరతఖండం
చేసినదీ..... సస్యస్యామలం "2" గంగ"

"చ" : రైతన్నలకు సిరిసంపదలు
పంటపొలాలకు తరగని నిధులు "2"
నెల మూడువానల పుణ్యభూమి
నేలతల్లికిది, ఆనందజలధి "2" "గంగ"

"చ" : సాగరమున నదుల కలయిక
అన్నదాతల కనుల నీరిక "2"
ఆనకట్టలే హద్దులు, నీటికి
నీటితోనే మనుగడ రైతుకి "2" "గంగ"

"చ" : వ్యవసాయానికి, ముఖ్యసాధనం
నీటివనరులే, ఇది సత్యం "2"
ఆ వనరులె సమముగ అందనినాడు
రైతువేదనం, అరణ్యరోదనం "2" "గంగ"

"చ" : కర్షక కన్నుల ఆనందం
జీవనదుల పరిరక్షణం "2"
దేశానికి అవి ఆభరణాలు
దేశప్రగతికవి సోపానాలు "2" "గంగ"

# జాతిపిత మన బాపూజీ

"రఘుపతి రాఘువ రాజారాం; పతితపావన సీతారాం"

ఈశ్వర్ అల్లా తేరేనాం, సబ్ కో సన్మతి దే భగవాన్: -

"పల్లవి" : జాతిపిత మన బాపూజీ
జాతికి నేత బాపూజీ "2"

"అ.ప" : ఎందరో నేతల త్యాగఫలం
వీచె దేశమున స్వేచ్ఛామారుతం "జాతిపిత"

"చ" : దేశం పరదేశ దాస్యశృంఖలం
వీరులు నేతల బలిదానం "2"
త్యాగ ఫలితమే మన స్వాతంత్ర్యం
విముక్తి పొందెను మనదేశం "2" "జాతిపిత"

"చ" : రత్నగర్భ మన భరతఖండము
నిధి, నిక్షేపం, స్వతంత్రదేశం "2"
సహజ వనరులకు పెట్టిందిపేరు
వలదు, వలదు, ఇక వ్యర్థపు పోరు "జాతిపిత"

"చ"  :  రాముడు, అల్లా, క్రీస్తు, నానక్
దైవమేదైన ఏకతత్వము  "2"
భిన్న మతముల సామరస్యము
చిగురించాలీ సోదరభావం  "జాతిపిత"

"చ"  :  ఐకమత్యమే మన ఆయుధము
చేరనీయకూ బేధభావము  "2"
ఏకమవ్వాలి  మనమందరము
సత్యం, శివం, సుందరం  "జాతిపిత"

# తనవారలని తలచినవారే

"పల్లవి" : తనవారలని, తలచినవారే.....
పరవారలగుదురు, తరచి చూచిన

"అ.ప" : పరులని మిగుల, తలచినవారే....
తనవారలుగా..... దరిచేరెదరు "తన"

"చ" : ఆలుమగలను బేధమె ఉండదు
తల్లీ తనయును, తారతమ్యములేదు "2"
కాలచక్రమున మార్పులు ఎన్నో
కాలాంతరమున కూర్పులు ఎన్నో "తన"

"చ" : ఇక్కట్లు ఎన్ని తరలి వచ్చినను
ఇరకాటములు ఎన్ని చుట్టియున్నను "2'
వీడవులె, బేధములు మనసులలో
బ్రతుకవలె, ఎల్లరు కలసికట్టుగ "తన"

# దీపావళి

"పల్లవి" : దీపావళీ ఇది, దీపావళి
ఆనంద సంబర వెన్నెలలే ఇవి "దీపా"

"చ" : తిమిరమును కాంతి
తరిమిన వైనం "2"
చెడుపైన, మంచి
సాధించిన వియజం "దీపా"

"చ" : నారి విల్లును
సారించిన శౌర్యం "2"
అసురుని దునిమిన
ధైర్యసాహసం "దీపా"

"చ" : లోకపాలకుని
అవతారములకు "2"
పరమార్ధమునే
చాటిన శుభదినం "దీపా"

"చ" : అసుర శిక్షణ

లోక రక్షణ "2"

ఆనంద కాంతులు

ప్రసరించిన ఘడియలు "దీపా"

"చ" : పిన్న, పెద్దల

ఏకతత్వము "2"

ఆనంద సందడుల

ఐకమత్యము "దీపా"

# దేహములే వేరులే

"పల్లవి" : దేహములే వేరులే
స్నేహమంటే మనదేలే "2"

"అ.ప" : స్నేహానికి ప్రతిరూపమే
స్నేహమంటే మనదేలే "దేహములే"

"చ" : తలిదండ్రులు వేరైనా
రెండు ఆత్మలు ఒకటేలే "2"
త్యాగం, వేరుగ తెలియదులే
అది మా రక్తములో కలిసున్నదిలే "దేహములే"

"చ" : నీవు, నేను వేరను భావమె
మా మనసులకు దరి రాదులే "2"
హిమాలయములే మాకు చేరువలె
హిమము వలె, మా మనసు కరుగులే "దేహములే"

"చ" : అసూయలకు తావులేదులే
అపార్ధములకు చేరువకాములె "2"
ఒకరికొకరికి స్నేహమె తోడు
స్నేహమె మా తుది ఊపిరిలే "దేహములే"

# నమో నమో  జయ భరతమాత

"పల్లవి" : నమో! నమో! జయ భరతమాత
నమో! నమో! జయఘనపతాక "2"

" అ.ప" : భిన్నమతముల..., ఏకతత్వము
మమేకమైనది ప్రజానీకము "నమో"

"చ" : విజయదుందుభులు మ్రోగె ఖండమున
విజయోత్సాహము ప్రొంగె కంఠముల "2"
విజేతలు, వీరుల కరతాళములతొ
ఏకమైనదీ..... జనసందోహం "నమో"

"చ" : వేలకంఠములు మిళితమైనవి
చేసిరి, ఆనంద, సంబరగానం "2"
వేనోళ్ళన, నిను, పొగడంగ
జాతికన్నులూ, అశ్రుయమునా-యె "నమో"

"చ" : జనరంజనమే, తన ఆనందము
త్యాగనిరతియే, దేశప్రగతియని "2"
తలచిననాడే దేశపురోగతి
సగటుమనిషి, కనుల..., నిండుజాబిలి "నమో"

# నలుదిక్కులలో

"పల్లవి" : నలుదిక్కులలో నీ చరితం
అమ్మా! భరతావనీ "2"
పరమం పరమపావనం
ఆసేతుహిమాచలం "నలు"

"చ" : అలనాటి రాయల స్వర్ణయుగమున
అంగళ్ళ రతనాల నమ్మిన ఘనత "2"
ఆ చరితం పునరావృత్తం
కావాలంటే కృషి తధ్యం "నలు"

"చ" : అలరారెనులే! భువనవిజయము
అష్టదిగ్గజ, కవికోవిదులతో "2"
కవులనాలుకల, వాగ్దేవి పలుకులు
జగతికి వలసిన జీవనసిరులు "నలు"

"చ" : భూపాలురు, చక్రవర్తులూ
ఏలిన తెలుగుగడ్డ ఇది "2"
కళాపోషణం, కవిపోషణలతో
వెలుగొందిన ---, భరతభూమిరా "నలు"

"చ" : బుద్ధం శరణం, గచ్ఛామి, ధర్మం శరణం
గచ్ఛామి, సంఘం శరణం, గచ్ఛామి "2"
గౌతమబుద్ధుని బోధనలు
మానవాళికవి అమృతగుళికలు "2"
అహింసయే పరమధర్మమని
బోధించెనులే! సకలమతములు "నలు"

"చ" : మహాయోగుల పాదస్పర్శతో
పునీత అయినదీ... భరతమాత "2"
చెమ్మగిల్లిన కన్నులతో
పులకిత అయినదీ, భరతభూమి "నలు"

"చ" : పచ్చనినేలలూ పసిడిపంటల
నిలయమోయీ! మనదేశం "2"
నవధాన్యములతో గాదెలు నిండుగ
తులతూగెనులే! పల్లెసీమలు "నలు"

# నవ్వూ నవ్వూ చిరునవ్వూ

"పల్లవి" : నవ్వూ నవ్వూ చిరునవ్వూ
పసిపాపల , సిరి, చిరునవ్వు "2"

"అ.ప" : దేవుని సెలవు ఇది
భావితరాలకు ఆశల కొలువు "నవ్వూ"

"చ" : నగవుకు అమ్మ
కన్నుల వెలుగు "2"
అది కోటి ఆశల
మెరుపుల వెలుగు "2" "నవ్వూ"

"చ" : నగవున దేవుని
చల్లని చూపులు "2"
మోమున చక్కని
జిలుగు వెలుగులూ "నవ్వూ"

"చ" : కనిపించెనులే!
తన భవిత "2"
ఇక ఆనందాల
వడి వడి నడక "2" "నవ్వూ"

"చ" : కలల కనులలో

కనిపించు ధీమా "2"

జాతికి మీరే సరి చిరునామా "2"

చాచా కలలూ నిజమవునమ్మా

మన చాచా కలలూ "2"

సొంతమవును మీ సుందరస్వప్నం "2" "నవ్వా"

# పద పద పద

"పల్లవి" : సరిగమ పద - పద పద ముందుకు పద "2"

మొదటి అడుగె నీ ప్రారంభం

అలుపెరుగదు నీ సమర ఆయుధం "2"

అన్నిదిక్కులూ ఒక్కటైనవి "2"

మధ్యాహ్నపు నడి భానుడిలాగ "పద పద పద"

"చ" : రాజు, పేద అని బేధమె లేక

సాటిపొరుడే వీరుడుకాగా "2"

సాధకుడై ..... బోధకుడై "2"

సాగాలీ..... నలుదిక్కులలోన "పద పద పద"

"చ" : సరి సామాన్యుడి జీవనగతినే

మార్చి,సంతోష సుఖములతో "2"

జీవించుటె, తనజన్మహక్కని "2"

ఎలుగెత్తీ ..... నువు శంఖనాదమై "పద పద పద"

"చ" : శాంతియుతము నీ..... ప్రధమసూత్రమై

జాతి సౌఖ్యమే అభిమతమ్ముగా "2"

సాగించీ ..... సాధించి "2"

మాత కలలనే ..... సఫలముచేయి "పద పద పద"

# పైపైమెరుగులను

"పల్లవి" : పైపైమెరుగులను పసిడియనుకుంటె
మోసబోదువే అమ్మాయీ "2"
కల్లలన్నియు కమనీయమనుకుంటె
తెల్లబోదువే..... సుకుమారీ "2" పైమెరుగు"

"చ" : నేతి బీరను నేయి ఉందని
బీరములే ఘన కార్యాలని "2"
మాటలాడు మహాఘనులకు
నేర్పవె నీవు గుణపాఠం "2" "పైమెరుగు"

"చ" : నీ సమయకాలములను
జేసితివేని, నిరుపయోగము "2"
నీ ఉనికినే నీ వెరుగక
మెలిగిననూ ప్రమాదమే "2" "పైమెరుగు"

"చ"	:	అరచేతిలో స్వర్గము జూపి
కడుపునింపే వట్టిమాటల	"2"
నీడ నీపై పడనీయవద్దు
నీ యోచన నీ ప్రగతికి ముద్దు "2" పైమెరుగు"

"చ"	:	తల్లిదండ్రుల ఆశయాలను
నెరవేర్చు నీవు ఆనందముగ	"2"
నీ....బాటనే బంగారు బాటగ
చేసుకో, లక్ష్యము దిక్సూచిగ "2" "పైమెరుగు"

# బాలలం మేం బాలలం

"పల్లవి" : బాలలం మేం బాలలం
నవ సమాజపు దివ్వె వెలుగులం "2"
అమ్మా నాన్నల ముద్దుబిడ్డలం
చాచా నెహ్రూ కలల జ్యోతులం "2"
సమ సమాజమును స్థాపించే సాటిలేని పునాదులం "బాలలం"

"చ" : గాంధీ మార్గమె పూలతోటయై
గాంధీ సత్యమె పూసుగంధమై "2"
సమ సమాజమే నిర్మిస్తాం "2"
సమ దృష్టితో మేం జీవిస్తాం "బాలలం" "2"

"చ" : "వృక్షో రక్షతి రక్షిత:"!
అన్న నానుడీ సఫలం చేస్తాం "2"
"వనరక్షణయే జనరక్షణ" యని "2"
లోకానికి మేం చాటి చెప్పుతాం "బాలలం" "2"

"చ" : విద్య అనునదీ మనిషి భూషణం
"విద్య" నేర్పితే అందు అందలం "2"
పంచితె పెరుగును విద్యాధనము "2"
దేశసంపదకు మూలధనము "బాలలం" "2"

"చ"  :  అజ్ఞానం రూపుమాపుదాం
దురాచారమును తరిమికొట్టుదాం  "2"
విజ్ఞానమనే చెట్టునీడలో
వివేకులమై సేదతీరుదాం  "బాలలం"

"చ"  :  అభివృద్ధియె మా ముఖ్యలక్ష్యము
దరిచేరవు ఏ కరువు కాటకం  "2"
"కృషితో నాస్తి దుర్భిక్షం"
అన్న సామెతను సత్యం చేస్తాం  "బాలలం"  "2"

"చ"  :  సర్వమతమ్ముల సమానత్వమె
నడుపు జాతినీ ప్రగతిపథం  "2"
గాంధీ లక్ష్యం అక్షర సత్యం  "2"
ఆదరిస్తాం, మేం ఆచరిస్తాం
బాపు బాటలో పయనిస్తాం  "బాలలం"  "2"

"చ"  :  "పల్లెసీమలే పట్టుకొమ్మలని"
జాతిని ముందుకు నడిపిస్తాం  "2"
అన్నదాతయే దేశబలమ్మని
భారతీయతను నిలబెడతాం "బాలలం"  "2"

# బిడ్డను చూచీ

శ్లోకం : రామలాలీ, మేఘుశ్యామాలాలీ,
రామా, రవికుల రతన, దశరధ తనయా, లాలీ "2"

"పల్లవి" : బిడ్డను చూచీ తల్లి సంతసం
బిడ్డను చూచిన, తండ్రికి మోదం "2"
బుడి బుడి బుడి బుడి బుల్లి అడుగులతొ
నడిచిన పాపడి బోసినవ్వులు
అంతరంగమున పూయును పూవులు "2" "బిడ్డను"

"చ" : మూడవయేటనె, బడిలొ ప్రవేశం
పెరుగు తల్లికి, బాధ్యత అధికం "2"
మంచి పోషణం, బిడ్డ పెరగడం
పాప పెంపకం, తల్లి సంబరం "2" "బిడ్డను"

"చ" : పాఠశాలలొ, దాటు తరగతులు
గురువుల బోధన, మంచి ప్రవర్తన "2"
గృహమునందున, మంచి భాషణం
తండ్రి మనసులో కలుగు నమ్మకం "2" "బిడ్డను"

"చ"    :    మంచి స్నేహితులు పాపడి ఎంపిక
సత్యబోధనలు గురువుల ఎంపిక    "2"
మంచిస్నేహము, పొందు లాభము
తల్లి, దండ్రిపై గౌరవభావం   "2" "బిడ్డను"

"చ"    :    పాపలవృద్ధియె కుటుంబవృద్ధి
కుటుంబవృద్ధియె, సమాజవృద్ధి   "2"
ప్రతిగృహమూ ..... నందనవనము  "2"
అదియే పాపల మందహాసము  "2"  "బిడ్డను"

## భరతమాత

"పల్లవి" : వందే.... మాతరం

భరతమాతకూ ...వందనం

అన్నపలుకులు సరిపోవురన్నా "2"

"అ.ప" : చిలుకపలుకులు పలికేమనము

చితికిన బ్రతుకుల, కనలేమన్న "భరత"

"చ" : సాటిమనిషికి చేయూతను

ఇచ్చిననాడే.... సఫలం నీ పలుకు "2"

ప్రతిగృహమందున కొనసాగు అభివృద్ధి

అదియె సమాజ మేలగునులే.... "భరత"

"చ" : ఎనలేని బోధనలు ఎన్ని చేసినను

ఉపన్యాసములు ఎన్ని ఇచ్చినను "2"

కాలేకడుపులు నిండిననాడే

అదియె ఆచరణ సాధ్యమవునులే! "భరత"

# లాలిపాట

"పల్లవి" : లాలిపాటతోనె చిందు
పాప బోసినవ్వులు "2"
అందరి మదిలో, వీచు
మలయ మారుతములు "లాలి" "2"

"చ" : అమ్మ, నాన్న ఒడిలొ
మొదలు, పాప కే...రింతలు "2"
చేయును సందడులు
నవ్వుల కిలకిలలూ "లాలి" "2"

"చ" : తాత అవ్వ ఒడి ఒడిలో,
నేర్చు, మొదటి పలుకులు "2"
అవియే, తన భవితకు
పరయు పూలత్రోవలు "లాలి" "2"

"చ" : బడిలొ ఉపాధ్యాయులూ,
విద్యార్థుల సహకారం "2"
అదియే మనోల్లాసము
పాప మనోవికాసం "లాలి" "2"

"చ" : చదువు నేర్చు అనుదినము,

తరగతిన వచ్చు ప్రధమము "2"

సాధించును విజయములు

నిజంచేయు, నమ్మకములు "లాలి" "2"

# విధి బలీయమని

"పల్లవి" : విధి బలీయమని, ఎరిగినను, మనము

ఎదురీదగా..... యేల యత్నించేము? "2"

"చ" : కలసివచ్చిన, కాలమందున

మాటయె, మారును, మంత్రముగ "2"

కాటువేయు కాలచక్రములో.....

మౌనమే...., మనకు వరమగునులే "విధి"

"చ" : జీవనగమనములో కష్టములు సహజము

నాటి కష్టమే.... నేడు సంతసమగును "2"

ఊగును మనము, ఆనందడోలికల

కానవచ్చు లోకము, రంగవల్లిగ "విధి"

# విరిసీ విరియని పూవులం

"పల్లవి" : విరిసీ విరియని పూవులం
భావి భారత పౌరులం "2" "విరిసీ"
భరతమాత ఒడిలో పెరిగె
చిట్టి పొట్టి చిన్నారులం "2" "విరిసీ"

"చ" : అమ్మా నాన్నల కనుసన్నలలో
మెలగి మేము నడుచుకొంటాం "2"
వారుకన్న కలలన్నీ
నిజం చేయడం మా కర్తవ్యం "2" "విరిసీ"

"చ" : ఒకే బాటగా పయనిస్తాం
ఒకే మాటగా అనుసరిస్తాం "2"
అభ్యుదయమె, మా మొదటి మెట్టని
ఏకమవుతాం..... మమేకమవుతాం "2" "విరిసీ"

"చ" : సమరయోధుల అడుగుజాడలు

భావితరాలకు రహదారులని "2"

అనుకరిస్తూ, ఆచరిస్తాం

భరతమాతకు "జై" అంటాం "2" "విరిసీ"

"చ" : ప్రజానాయకుల ఐకమత్యముతొ

పాలనమే ఇక రామరాజ్యము "2"

సగటుమనిషికి లోటేరాని "2"

ప్రభుత్వానికిదే...... వందనం "2" "విరిసీ"

# శరణం భవ శరణం

"పల్లవి" : శరణం, భవ, శరణం
సతతం, గురు స్మరణం "2"

"అ.ప" : మంగళరూపం నీపాదపద్మం "శరణం"

"చ" : వేదశ్రవణం, జీవన ఆధారం
వేదాంతశ్రవణం, ముక్తిప్రదము "2"
జ్ఞానార్జనం, అజ్ఞాన ఛేదనం
విజ్ఞానశోభితం నీ గమనం "శరణం"

"చ" : సందేహ నివృత్తం, మేధ సోపానం
పరిపూర్ణజ్ఞానం, పదసోపానం "2"
సత్యాన్వేషణం, శోధనపథము
సఫలం నీ జయం ఇది తధ్యము "శరణం"

"చ" : గురువచనం, ఆదరణయోగ్యం
గురుమార్గం, ఆచరణమార్గం "2"
గురుతత్వము, నిశ్చలమనము
అది జీవ, పరమాత్మ మిళితము "శరణం"

# శ్రీరస్తూ

"పల్లవి" : శ్రీరస్తూ నీకు శుభమస్తు "2"
గృహస్తూ నీకు శుభమస్తు "2"
కుటుంబమే, నీ తొలివెలుగు
కనురెప్పగా కాచేవు "2" "శ్రీరస్తూ"

"చ" : సంసారమను రథమునకు
భార్యాభర్తలు చక్రములు "2"
నడిపేవు నీవు రథసారథివై
ఆలుబిడ్డలే రహదారిగ "2" "శ్రీరస్తూ"

"చ" : కొంత పొదుపు మేలుసలుపు
అన్న చందమున మెలిగేవు "2"
దూరదృష్టితో సాగేవు
దుబారా వ్యయము నిరసించేవు "2" "శ్రీరస్తూ"

"చ" : ఆలుబిడ్డల మంచి చెడ్డలు
నీ అభివృద్ధిగ తలచేవు "2"
వారి ముద్దూ ముచ్చటలు
నీ ఆనందమని మసలేవు "2" "శ్రీరస్తూ"

"చ:    :    కార్యనిర్వాహణయే నీ ధ్యేయము

అధికారుల మన్ననలు    "2"

ఆలుబిడ్డల అభినందనలతో

లోలోన మురిసి ఆనందించేవు "2" "శ్రీరస్తూ"

# సప్తవర్ణములు

"పల్లవి" : సప్తవర్ణములు, సప్తలోకములు
నడచె, సప్తపది, వధూవరులు "2"

"చ" : ఉన్నవి, వర్ణములు, జగతియందు,
అయిననూ నిలుచిను, తెలుపు ముందు "2"
మరి లోకములెన్ని యున్నను,
సాగవలె, మనుగడ, అశోకవనముగ "సప్త"

"చ" : మీరక, ఏడడుగులు, వధూవరులు
నడచినను,ఉండవలె, ఒక్క అడుగుగ "2"
కాదు, వలసినవి అంకెలు
కూడదు, మనసున యే శంకలు "2" "సప్త"

"చ" : శ్వేతవర్ణము - సప్తవర్ణముల - కూడలి
కావాలీ జీవితమున, మనకు ... కొంతమజిలీ
ఆకాశమున జాబిలే... వెలిగే నిండులోగిలి
వలదు, యోచనకు ఏ ... బదిలీ "సప్త"